60th Year of Publication వజ్రోత్సవ సంవత్సరం

# జమీన్ రైతు

స్థాపకులు: నెల్లూరు వెంకట రామానాయుడుగారు * సంపాదకుడు : నెల్లూరు డోలేంద్రప్రసాద్ * మేనేజింగ్ ఎడిటర్: నెల్లూరు శ్రీరామమూర్తి

ESTD. 1930
Regd. No. H. NL. 18
సంపుటి: 60 సంచిక : 86
8-9-1989
నెల్లూరు
శుక్రవారం
10 పేజీలు రూ 1.60

# ఎన్టీఆర్ ప్రభుత్వం డిస్మిస్‌కు యత్నం?

తెలుగుదేశం ప్రభుత్వాన్ని డిస్మిస్ చేయాలనే ప్రతిపాదనతో రాష్ట్ర కాంగ్రెస్ నాయకులు ఢిల్లీకి ప్రయాణం కడుతున్నారు. కాంగ్రెస్‌లో తీవ్రవాదులుగా పరిగణింపబడే డాక్టర్ వై. ఎస్. రాజశేఖరరెడ్డి,

మా హైదరాబాదు ప్రత్యేక విలేఖరి

సమరసింహారెడ్డి, పి. జనార్దన రెడ్డి, మైసూరారెడ్డి వంటివారు ఈ ప్రతిపాదనను లేవనెత్తారు.

రోజురోజుకూ క్షీణించిపోతున్న నక్సలైట్ల సమస్య, పోలీసులు మంత్రిపైనే తుపాకి ఎక్కుపెట్టడంవంటి ఘోరాతిఘోరం సంఘటనలు రాష్ట్రంలో ప్రభుత్వమున్నదే లేకుండా చేస్తున్నాయని, ప్రజల ప్రాణాలకు భద్రతలేదని వీరు కేంద్ర నాయకులకు వివరించారు.

రాజకీయంగాకూడా ఎన్. టి. రామారావును ముఖ్యమంత్రి సీటులో కూర్చోబెట్టి ఎన్నికలు జరిపితే తెలుగుదేశం విజయంకోసం ఆయన ఎన్ని అడ్డదారులైనా త్రొక్కగలరని; అధికార, పోలీసు యంత్రాంగాలను విచ్చలవిడిగా వాడుతారని; కాంగ్రెస్‌కు ఇది తీవ్ర అవరోధం కాగలదని వీరి వాదన.

ఈ ప్రతిపాదనపట్ల ఢిల్లీలోని ఒకవర్గం నాయకత్వం సుముఖంగా వున్నట్లు వార్తలందుతున్నాయి.

క్షీణించుతున్న నక్సలైట్ల ఆగడాలు కాంగ్రెస్‌వాదులకు పెద్దఅవకాశంగా పరిణమిస్తున్నాయి. నక్సలైట్లను నివారించడం రాష్ట్రప్రభుత్వం చేతకానిపని అని రుజువైపోయింది. వారు కిడ్నాప్‌లు చేసినా, దోపిడీలకు దిగినా, హత్యలు చేసినా మౌనంగా చూస్తూ ఊరుకోవడంతప్ప ఏమీ చేయలేకపోతున్నారు.

ఇంకొక ప్రక్క ఎన్. టి. రామారావు అసందర్భ ప్రేలాపనలూ అదుపుతప్పిపోతున్నాయి. ప్రధాన మంత్రి రాజీవ్ గాంధీని అయన నేరుగా, వ్యక్తిగతంగా నీచమైన పరిభాషలో విమర్శిస్తున్నారు. దేశ ప్రధానిని పట్టుకొని దేశద్రోహి అన్నారు; సైనికులకు తుప్పుపట్టిన తుపాకులిచ్చారని విమర్శించారు; వీటన్నింటినీ మించినది- సైన్యంలో తిరుగుబాటు రానంతట అదే వస్తుందని వ్యాఖ్యానించడం. మ్యూటినీ అనేపదానికి ఆయన అర్థంతెలిసి వాడాడో లేక తెలియని తనంతో వాడాడో కాని ఈ విషయాన్ని కేంద్ర ప్రభుత్వము, రాజీవ్‌గాంధీ చాలా తీవ్రంగా పరిగణించారు. ప్రధాని విదేశీ పర్యటనకు వెళ్ళబోయేముందుకూడా, ఈ విషయంపై దర్యాప్తు చేయమని హోంమంత్రి బూటాసింగ్‌ను ఆదేశించారు. తనను దేశద్రోహి అని విమర్శించినప్పటినుంచి రాజీవ్‌గాంధీ ఎన్ టి ఆర్ అంటే మండిపడుతున్నారట.

ఈ అవకాశాలన్నింటినీ ఉపయోగించుకుని ఎన్ టి ఆర్ ప్రభుత్వాన్ని డిస్మిస్ చేయించాలని రాష్ట్ర కాంగ్రెస్ నాయకుల భావన. ఈ ప్రతిపాదనను రాజీవ్‌గాంధీ కూడా ఓ కె చేశారని చెప్తున్నారు. ఆయన సమ్మతి లభించిందని తెలియడంతో కేంద్ర హోం శాఖ తెలుగు దేశం ప్రభుత్వ వైఫల్యాలపై ఒక ప్రత్యేక ఫైలును తెరిచి

-కొరవ 6వ పేజీలో

- రాష్ట్ర కాంగ్రెస్ నాయకుల పట్టుదల!
- రాజీవ్‌గాంధీకూడా సుముఖమట!
- నక్సలైట్ల సమస్యే తెలుగుదేశం కొంప కూలుస్తుందా?

# చెన్నారెడ్డిని తీసివేస్తారా? తోక కత్తిరిస్తారా?

పి సి సి నాయకత్వం విషయంలో అధిష్టానవర్గం ఇంకా ఒక నిర్ణయానికి వచ్చినట్లు కనబడడంలేదు. చెన్నారెడ్డిని మార్చి, కొత్తవారిని పెట్టే ఆలోచన అట్లనేవుంది. రాష్ట్ర కాంగ్రెసీయులలోకూడా చెన్నారెడ్డిని కొనసాగించాలనే వారికంటే, తీసివేయాలనే వారి సంఖ్యే ఎక్కువగావుంది.

చెన్నారెడ్డి వ్యక్తిగత బలహీనతలు రాజకీయ అశక్తతలను ప్రధానికి వివరించడంలో జనసమ్మతివాదులు కృతకృత్యులైనారు. ఢిల్లీ పెద్దలనుంచి మద్దతు సానుకూలంగాలభించినందువల్లనే లెజిస్లేచర్ పార్టీ సమావేశంలో పిసిసి అధ్యక్షుడిపై అంత వచ్చిగా, నేరుగా విమర్శల దాడి జరిగిందని పరిశీలకుల ఊహ.

మా రాజకీయ పరిశీలకుడు

పి. జనార్దనరెడ్డి వంటివారు చెన్నారెడ్డిని కించపరచి మాట్లాడడంలో ముందు మిగులుతున్నారు. పి సి సి అధ్యక్షుడు తమనేమీ చేయలేరనే ధైర్యమే వారినందుకు పురికొల్పుతున్నది. అధిష్టానవర్గం ఈ తిరుగుబాటుధోరణులను మౌనంగా పరికించి చూడడంతప్ప, నివారించడంలేదు. చెన్నారెడ్డి ప్రవర్తన, పనితీరులపట్ల తమ అసంతృప్తిని వారావిధంగా వ్యక్తంచేస్తున్నారు. పి సి సి అధ్యక్షతలో ఇప్పుడు మార్పులు తలపెడితే ఎన్నికలలో పార్టీ నష్టంపాలౌతుందన్న భయం వారి కాళ్లకు బంధాలు వేస్తున్నది. అయితే చెన్నారెడ్డిని పి సి సి అధ్యక్షుడిగా పెట్టి ఎన్నికలలో పోటీచేయడం పార్టీశ్రేయస్సుకు మంచిది కాదన్న ఆలోచనా ఇంకొక ప్రక్క వారిని పీడిస్తున్నది. ఒకవేళ మార్పు చేస్తే మరెవ్వరికి ఆ బాధ్యత అప్పచెప్పాలన్నది ఇంకా పెద్ద ప్రశ్న. ఎవ్వరినిపిల్చి గద్దె ఎక్కించినా మళ్ళీ అసంతృప్తులు, అలకలు మొదలౌతాయి.

అందువల్ల చెన్నారెడ్డినే పదవిలో కొనసాగించి, ఆయనకు అధికారాలేమీలేకుండా చేయాలన్న ప్రతిపాదననుకూడా పరిశీలిస్తున్నారు. పి సి సి లో మార్పులకంటే, పిసిసి అధ్యక్షుని తోక కత్తిరింపు మంచి ఫలితాల నివ్వగలదని వీరి ఆలోచన. టిక్కెట్ల పంపకం బాధ్యతను పిసిసి నుంచి తప్పించి, ఢిల్లీ చేతిలో పెట్టుకుంటే సరిపోతుందన్నది ఒక అభిప్రాయం. అన్ని నిధుల పంపకం, ప్రచార బాధ్యతలను సైతం ఢిల్లీనుంచే జరిపించాలని ఆలోచన.

లేదా పి సి సి స్థాయిలో ఒక ఉన్నత స్థాయి సంఘాన్ని నియమించి పి సి సి కార్యక్రమాలన్నింటినీ ఆ సంఘంద్వారా జరిపించాలనే ప్రతిపాదన సైతం వినవస్తున్నది.

ప్రధాని శ్రీ రాజీవ్‌గాంధీ విదేశీపర్యటన నుంచి రాగానే ఏదో ఒక నిర్ణయం జరిగిపోతుందని భావిస్తున్నారు. ✱

# జమీన్‌రైతు

## ఇప్పుడా పట్టుదలలు?

నక్సలైట్ సమస్యపై కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ఎవరి మొగం, పెడమొగంగా వ్యవహరించడం విచారం కలిగిస్తున్నది; ఫెడరల్ రాజ్యాంగవిధానం మౌలికస్వరూపాన్నే ఈ వైఖరులు ప్రశ్నార్థకంలో పడవేస్తున్నాయి.

తెలుగుదేశం ప్రభుత్వం అసమర్థ, అస్పష్ట, అనిశ్చిత విధానాలవల్ల; ముఖ్యమంత్రి ఎన్. టి. రామారావు గందరగోళపు వైఖరుల వల్ల రాష్ట్రంలో నక్సలైట్ల సమస్య విశ్వరూపం ధరించింది. నిజానికి నక్సలైట్లు ఎన్. టి. రామారావుతో వచ్చినవారుకాదు; రెండు దశాబ్దాలకు పైనుంచి రాష్ట్రంలో నక్సలైట్లు ఉన్నారు. శ్రీకాకుళం పోరాటం ఒకనాడు రాష్ట్రమంతా భయాందోళనలు సృష్టించిందికూడా! అప్పటి ప్రభుత్వాలుసైతం నక్సలైట్లను సమూలంగా తుడిచిపెట్టలేకపోయాయి. అయితే దమనకాండచేసి అయినా- వారిని ఎక్కడికక్కడ అదుపులో పెటేవారు.

ఎన్. టి. ఆర్. ప్రభుత్వంలో అది జరగలేదు; జరిగే అవకాశంకూడా కన్పించడంలేదు. నక్సలైట్లు అంటే ఎవరు అనే విషయంపై కూడా ఆయనకు సక్రమమైన అవగాహనలేదు. ఒకసారి దేశభక్తులంటారు; ప్రక్కరోజే నరరూప రాక్షసులంటాడు. నక్సలైట్ల గురించి మాట్లాడాలన్నా ఆయనకు భయమే. తానుమాత్రం కమాండోల రక్షణతో, మెటల్ డిటెక్టర్ల కాపలాతో తిరుగుతున్నాడు- తన పార్టీవారు గ్రామాలలో నక్సలైట్లను ఎదుర్కొనడంలేదని రుసరుసలాడుతున్నాడు. ఈ అయోమయ ప్రవర్తనే నక్సలైట్ల సమస్యను అయన నెత్తికి తెచ్చింది.

ఇంతకాలం బింకంగావుండినముఖ్యమంత్రి, కేంద్రం సహాయం చేస్తానని చెప్పినా అవసరంలేదని తిరస్కరించిన ముఖ్యమంత్రి చేతులు కాలినతర్వాత కేంద్రం శరణుజొచ్చాడు. గుత్తేదు అడవుల్లో ఐ ఎ ఎస్ అధికార్ల కిడ్నాప్ సమయంలోనే కేంద్ర హోంశాఖ నక్సలైట్ల నిర్మూలనకు కమెండోలను వాడమని సలహా యిచ్చింది; సైన్యాన్ని యిస్తానన్నది. కాని అప్పుడా ప్రతిపాదనను తిరస్కరించారు.

ఇప్పుడు రాష్ట్ర ప్రభుత్వం సైనిక సహాయం అడిగితే కేంద్రం మీనమేషాలు లెక్కపెడుతున్నది. పరిస్థితి తీవ్రతను వారు అర్థంచేసుకోనందువల్లనో ఏమో, త్వరపడి సహాయం అందజేయడానికి జనుల, పథకాలు, ప్రణాళికలవివరాలు అడుగుతున్నారు. తన తప్పును కప్పిపెట్టుకొని కేంద్రంపై నెట్టివేయడానికి ఎన్టీ ఆర్‌కు ఇదొక రాజకీయ అస్త్రంగా పనికివస్తున్నది.

ఇది చాలా విచారించదగిన విషయం. నక్సలైట్ల సమస్యవల్ల నిజంగాబాధపడుతుందేది ప్రజలు; ఏ రాజకీయంతోనూ సంబంధంలేని మామూలుప్రజలు. నక్సలైట్ల హింసాకాండ, పోలీసుల ప్రతిచర్యలతో తెలంగాణాలోని సగం జిల్లాలలో భయకంపిత వాతావరణం నెలకొనివుంది. ఏ రాత్రి ఏమిజరుగుతుందో తెలియని అయోమయావస్థలో ప్రజలు ప్రాణాలు పిడికిట్లోపెట్టుకుని బ్రతుకుతున్నారు. ఈ పరిస్థితులలో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు రెండూ కలిసి తక్షణం నక్సలైట్లబెడద నివారణకు కృషిచేయవలసివుంది. కేంద్రాన్ని సాయం అడిగితే తనకు పరువుతక్కువని ఎన్టీ ఆర్, వారడగగానే ఇస్తే చులకనై పోతామని కేంద్రం వ్యవహరిస్తే మధ్యలో నష్టపోయేది ప్రజలు!

ఇంకొకప్రక్క ఎన్టీ ఆర్ కేంద్రాన్ని విస్మరించి ప్రతిపక్ష ప్రభుత్వం రాజ్యంచేస్తున్న తమిళనాడునుంచి పోలీసులను తెప్పించాలని చూస్తున్నాడు. పొరుగురాష్ట్రంనుంచి సహాయంఅందుకోవడంలో తప్పేమీలేదుకాని, అది కేంద్రాన్ని బైపాస్‌చేసి పొందాలనుకోవడం, ఫెడరల్ రాజ్యాంగసూత్రాలను వుల్లంఘించడమే అవుతుంది. నక్సలైట్లవంటి శాంతిభద్రతల సమస్యలను, సైన్యం తనఆధీనంలోవుండే కేంద్రం తప్ప సాదాపోలీసులు గల్గిన రాష్ట్ర ప్రభుత్వాలు పరిష్కరించలేవు. ఎన్నికలసమయంలో రాష్ట్ర ప్రజలలో కేంద్రంపట్ల ద్వేషభావం కల్గించడానికి ఎన్టీ ఆర్ చేస్తున్న కుటిలయత్నం ఇది.

లక్షలాదిప్రజల ప్రాణాలతో ముడిపడిన సమస్యను, కేంద్రము రాష్ట్రప్రభుత్వమూ రాజకీయంచేయడం సమంజసంకాదు. ఇరుపక్షాలూ పంతాలుమాని ప్రజలను రక్షించడానికి కలిసి కృషిచేయాలి!

---

జమీన్‌రైతు

8-9-1989

18 పేజీలు అదా

### రైతుబిడ్డ

రైతులాటికి సంబంధించివవారంతా ఈ ఫిలిం చూడదగింది.

జమీన్‌రైతు అనేవాడు చూడదగేగాడు. ఈ సమస్య ను ఇంతమాత్రమైనా ఫిలింమీదకెక్కించినందుకు రామబ్రహ్మం గారికి నమస్కరించి తీరాలి వీరందరూ.

రైతుకేగాదు జమీందార్లుగూడ తమ అపభ్రంశాల ఈ యుద్ధంమీద జారి హృదయపరివర్తనకు ప్రవర్తించాలసిందీగూడా.

తక్కిన ప్రజాసీకంకూడా ఇలాంటి నరక కూపమైన జమీన్‌రైతు దుర్గతిని తిలకించి ఆ సమస్యపట్ల అత్యంతటు కన్నీటిబొట్లు కాల్చవలసిందీ గూడా—

జమీన్‌రైతు

. . .

వెంకటగిరి బొల్బలి జమీందార్ల ఈ ఫిలిమును ప్రదర్శించవలెనంటకి నోటీసిచ్చినవటా. దాని మద్రాసులాయర్లు 21నేది నెల్లూరుదర్బారు ఫిలిమును దర్శించి నోట్సు తీసుకపోయినవట. ఇంతవరకూ హైకోర్టులో కేసు దాఖలైనట్లు మాత్రం వర్తమానం తెలియదు.

. . .

రైతు సమస్యల్ని అద్భుతంగా చిత్రించిన అపూర్వ చిత్రం. జమీందారీ దౌర్జన్యాన్ని ప్రతిఘటించి రైతులలో నూతన చైతన్యాన్ని కల్గజేస్తుంది పల్లెల్లో గొప్పప్రబోధం కలిగిస్తుంది.

-జాపినీకు

### 50 ఏళ్ళ క్రితం ఈ వారం

#### లఘు విమర్శలు

నెల్లూరు ట్రంకురోడ్డు 4 వేది రాత్రి షుమారు పదిగంటలప్పుడు యిద్దరు పత్రికలవారిని లైట్లులేకుండా పోవుచుండినందుకు టౌను సబు యిన్స్పెక్టరుగారు దబాయిస్తుండినారట. నోటుగల ఒక రెడ్డిగారు 'తమరి సైకిలుకు లైటు వుందా' అని రంధ్రాన్వేషణం చేసేటప్పటికి, సబ్‌యిన్స్పెక్టరుగారు మాటమాట్లాడకుండా వెళ్ళిపోయినారట.

నెల్లూరు టౌను పోలీసు రోడ్డులో పోలీసువారి సైకిళ్ళకు లైట్లు అక్కరలేదని వుందా!

#### దామరమడుగు స్కూలు

ఉపాధ్యాయురాలికి సీట్లులేవు, కదలమెదలలేదు. ఇంటిలోనే దాకాలి, పోవాలి. అందువల్ల అన్ని స్కూలులోనే. గట్టుమట్టిది స్కూలు. పిల్లలు గూడా మిగిలారు.

అమ్మా! మా పిల్లలకు మీ ఆరోగ్య శాస్త్ర ప్రాక్టికల్ కోర్సు నేర్పుతూ పోతే తెంకవ్నాటెక్కి దయచేయరాదా!

-వెంకయ్య

#### వెంకటగిరిలో జమీన్‌రైతును తలఎత్తకుండా చేస్తావా?

జమీన్‌రైతు పత్రికలో జిల్లాబోర్డు సెలక్షన్ విషయంలో గమనించిన విమర్శన వుందని జిల్లాకాంగ్రెసు సెక్రటరి కె ఎల్ నారాయణరావుగారు జమీన్‌రైతు పత్రికను వెంకటగిరిలో తలఎత్తకుండా చేస్తానని ట్రంక్ రోడ్డులో శపథంచేసి ఆ ప్రకారమే వెంకటగిరి ఏజంటును నిలిపివేయించి పత్రికను రాకుండా జేశాడట!

ఓ దేశసేవ నారాయణరావ్! నీ కోడిని సంకబెట్టుకొని మరొక వూరికి

—తరువ 10వ పేజీలో

---

# తిట్టేది కుటుంబ పాలనను- ఇచ్చేది కుమారుల ప్లేరా?

కొత్తగా కాంగ్రెస్‌లో చేరిన నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డి వర్గం ఒకవంక తమకు పదవీవ్యామోహం లేదంటూనే, కాంగ్రెస్ టిక్కెట్లకోసం పడుతున్న ఆరాటం చూస్తుంటే ఆశ్చర్యం కల్గుతున్నది. శ్రీనివాసులు రెడ్డిగారు వేదికెక్కితే ఎన్. టి. రామారావు కుటుంబపాలన గురించి, అల్లుళ్ళగురించి మాట్లాడుతాడు. ఆయన ఎబిసిసి పరిశీలనకిచ్చిన జాబితాలో తనపేరు, తన కొడుకు ప్రసన్నకుమార రెడ్డి, తన అన్నకొడుకు జగన్మోహనరెడ్డి తన మేనల్లుడు చంద్రమోహనరెడ్డి పేర్లు ఇచ్చాడు. అంటే ఆయన ఒక్కడింట్లో నలుగురికి పదవులు కావాలన్న మాట. ఆయన, ఆయన కొడుకులుతప్ప కాంగ్రెస్‌లో ఇంకెవ్వరూ పదవులకు పనికిరారా? ఎమ్మెల్యే, ఎంపీపదవులు అయన కుటుంబసొత్తులా. వాస్తవంగా ఆలోచించడానికి జిల్లాలో ఏ రాజకీయ కుటుంబమూ ఇంత ఆత్రంగా వ్యవహరించడం లేదే! అంతమాత్రానికి ఆయన శ్రీరంగ నీతులు చెప్పడమెందుకు? మరొకసారి శ్రీనివాసులురెడ్డిగారు కుటుంబ పాలన గురించి మాట్లాడితే ప్రజలు రాళ్లు విసురుతారు!

నెల్లూరు —ఎం. మల్లికార్జునరెడ్డి

### కులవధువు

జమీన్‌రైతు ప్రతిసంచికలో నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డిగారి ప్రహసనం ప్రస్తావించడం అవసరమా?

"కులవధువు పిరవైన, గొప్పవిరుదుగాని కప్పురపిడెము విడవది"న్నట్లుగా వుంది ఆయనవైఖరి. ఆయనమీద చర్చ ఎందుకు దండగ!

మీ పత్రికలో జిల్లాప్రజాపరిషత్ సమావేశం వివరాలు వ్రాయలేదు. అందులో తెలుగుదేశం, కాంగ్రెస్ నాయకులు ఎంత చతురంగా ఒకరినొకరు విమర్శించుకున్నదీ పాఠకులకు చెప్తే బాగుండేది.

నెల్లూరు టి. ఎన్. రెడ్డి

### జమీన్‌రైతుపై దాడి- ఖండనలు

భారత్ బంద్ సందర్భంగా జమీన్‌రైతు వారపత్రిక కార్యాలయంపై కొందరు దుండగులు బాలకృష్ణ ఫ్యాన్స్ పేరుమీదుగా దాడి చేయడాన్ని తీవ్రంగా ఖండిస్తున్నాను. తెలుగుదేశంపార్టీ తరఫున, బంద్ నిర్వాహకులలో ఒకడిగా ఈ దుర్ఘటనకు బాధపడుతూ విచారం వ్యక్తంచేస్తున్నాను.

నెల్లూరు —టి. రమేష్‌రెడ్డి

ఛేర్మన్

నెల్లూరు మునిసిపాలిటి

. . .

హైదరాబాదులో వుండగా నెల్లూరులో ఒక వారపత్రిక కార్యాలయంమీద దుండగులు దాడిచేసినట్లు వార్త విన్నాను. అది మన జమీన్‌రైతు కార్యాలయం మీదనే అయివుంటుందని వూహించాను. పత్రిక చూసినతర్వాత నా అభిప్రాయం సరైనదని తెలిసింది.

పార్టీ విభేదాలు వున్నప్పటి ప్రజాస్వామ్యంలో పత్రికా స్వాతంత్ర్యాన్ని అణిచివేయడం వివేకవంతమైనదిగాని, పార్టీకిగాని తగదు. ఇటువంటి సంఘటనలను బట్టి నానాటికీ రాజకీయాలు ఎంతటి సంకుచితభావాన్ని అలవర్చుకొంటున్నాయో అర్థమవుతున్నది.

కావలి —ఎస్. ఎ. బార్పి

. . .

ఈ కాలం యువత పెడత్రోవలో నడుస్తున్నదనడానికి ఇదొక ఉదాహరణ. తేటుంటే 60 సంవత్సరాలుగా మీపత్రికదాని వ్యవస్థాపకులైన నెల్లూరు వెంకట్రామానాయుడుగారు కీర్తిశేషులైనప్పటికీ నిర్విరామంగా, దినపత్రికం కొత్త ప్రక్రియలను ఎదుర్కొంటూ సజావుగా ముందుకు సాగుతూ, నెల్లూరు మండలానికి ఒక గర్వకారణంగావుంటూ, ఈ జిల్లా

—తరువ 10వ పేజీలో



పర్వతరెడ్డి రామచంద్రారెడ్డిగారు

# కబీరు వేషానికి పర్వతరెడ్డిని మించిన నటుడు ఇప్పటికీ లేడు!

1916 లో శ్రీ నో ద య సమాజము రెండుగా చీలిపోయెను. అప్పుడు ఆంధ్ర నాటక కళాపరిషత్తువారు చిత్రనళీయమును పోటీ నాటకముగా నెల్లూరులో ప్రదర్శించిరి. పైరెండు సభలేగాక, మద్రాసును సుగూడ ఒక సమాజమువారీ పోటీలో పాల్గొనిరి. కానీ మద్రాసు సభ వారికి ఏ బహుమతియు దక్కలేదు. ఆ ప్రదర్శనమునకు శ్రీయుతుల హరిప్రసాదరావు (ప్రసిద్ధ హరిశ్చంద్ర పాత్రధారి), శ్రీ నారెళ్ళ పురుషోత్తం (కళా పరిషత్తు ఆర్గనైజరు) శ్రీ కందాడై దొరసామి అయ్యంగార్లు న్యాయనిర్ణేతలుగా వ్యవహరించిరి. నళ, బాహుక పాత్రలకు శ్రీ నాగరాజరావు, దమయంతిగా శ్రీనివాసాచారి, సుదేవుడుగా నేలనూతల రెండేసి సవర్ణ బంగారు పతకములను బహుమతులుగా పొందిరి. పునర్ప్రదర్శనములు కృషివలన పైరెండు సభలును ఒకటిగా మరల చేర్చబడెను. వేద-వారి సమాజము నుండి కొందరు ప్రసిద్ధులీ సభలో సభ్యులైరి. దీనిపేరు సుజన వినోదినీ సభ. దీనికి మొదటినుండి రాధాకృష్ణయ్య (ప్రసిద్ధ కబీరు పాత్రధారి) సభ్యుడయ్యెను. శ్రీ రాధాకృష్ణయ్య దేవకిపాత్ర పోషణయందు ఘనుడు. కాలక్రమమున కబీరు పాత్రధారణమున మిక్కిలి పేరొందెను. ఈ సభకు వి. ఆర్ హైస్కూలు సెక్రెటరీగానుండిన శ్రీ మాజా మాడభూషి నరసింహాచారి అధ్యక్షులుగను, శ్రీ ముత్తరాజా సుబ్బరావు ఉపాధ్యక్షులనై ఉండిరి.



కందాడై దొరస్వామి అయ్యంగార్

# నెల్లూరు ప్రాంత నాటకాల స్వర్ణయుగం (1900—1950)

▲

'నేలనూతల'

సభలెన్ని విధములుగా మారుచున్నను తన శిష్యులను వదలక శ్రీ ముత్తరాజా సుబ్బరావు వారితోనేయుండి వారి అభ్యున్నతికి కారకుడయ్యెను.

మద్రాసు సుగుణవిలాస సభవారు దారిద్ర్యాత్మముగా శ్రీ పాత్రి ప్రాధాన్యముగల ఒక పద్య కావ్యమును వ్రాసిన కవికి బహుమతిని ప్రకటించిరి శ్రీ ముత్తరాజా సుబ్బరావు ''రాజ్యశ్రీ'' పేరుతో హర్షవర్ధనుని సోదరి కథను ఒక పద్య కావ్యంగా వ్రాసి పంపి, నాలుగుసవర్ణ బంగారుపతకమును బహుమతిపొందెను. అప్పటినుంచి ఆయన గొప్ప కవిగా పేరొందెను. అప్పటికే బళ్లారివారి ప్రహ్లాద—

చిత్రనళీయం - రామదాసు నాటకములు తప్ప ఇంకే వియు ప్రింటుకాలేదు. శ్రీ సుబ్బరావు రాజ్యశ్రీ - లవకుశ - శ్రీకృష్ణలీలలు - రతిశిక్షణ - కచ దేవయాని - భక్తమార్కండేయ - నాటకములను వ్రాసి తన శిష్యులైన రావిప్రోలు, నేలనూతలలను తీర్చిదిద్ది మరికొందరిని జతచేసి ప్రదర్శింపజేసెను. కానీ వీరు బళ్ళారివారి నాటకములనుగూడ ప్రదర్శించియుండుటచే ఆ నాటకముల ముందు సుబ్బరావుగారి నాటకములకు తగిన ప్రోత్సాహము లేనందున రాజ్యశ్రీ - లవకుశ - శ్రీకృష్ణలీలలను ఆయన ప్రింటు చేయలేదు. వీరి కృష్ణలీలలు - లవకుశలు మూడుమార్లుమాత్రమే ప్రదర్శింపబడినవి.

ఆల్లూరిలో కృష్ణవిలాస సభలో నటాగ్రేసరుడు శ్రీ పర్వతరెడ్డి రామచంద్రారెడ్డి. వారి కోరికపై శ్రీ సుబ్బరావు తన భక్తమార్కండేయ నాటకమును వారికిచ్చెను ఇది నెల్లూరివారు దానిని ప్రదర్శింపలేదు.. శ్రీ రెడ్డిగారుకూడ ఆనాటకమును మొత్తముమీద ఐదుమార్లుమాత్రమే ప్రదర్శించెను. ఆ పై రెడ్డిగారు శ్రీ దువ్వూరి రామిరెడ్డిగారి ''సీతావనవాసము''

-కొనసాగింపు 9వ పేజీలో

# చేపల చెరువుల రైతులు వేలల్లో కరెంటుబిల్లుకట్టడం సాధ్యమా?

చేపల పెంపకాన్ని పరిశ్రమగా పరిగణించి, కరెంట్ ఛార్జీలను ఆ రేటులోనే చెల్లించాలని రాష్ట్ర ప్రభుత్వం చేసిన నిర్ణయాన్ని నెల్లూరుజిల్లా చేపల పెంపకం రైతుల సంఘం తీవ్రంగా నిరసించింది. 31 తేది సాయంత్రం టి.వి.ఎస్. కళ్యాణ సదనంలో జరిగిన సమావేశంలో ఈ విషయమై పెద్ద చర్చజరిగింది.

రాష్ట్రంలో చేపల పెంపకం జోరుగా జరుగుతున్న జిల్లాలలో కృష్ణా, గోదావరి తర్వాత నెల్లూరే ప్రముఖమైనది. నాలుగైదేళ్ళ క్రితం రాలాగొద్దిస్థాయిలో ప్రారంభమైన చేపల పెంపకం ఇప్పుడు ఐదు వేల హెక్టార్లకు విస్తరించింది. నెల్లూరు, కోవూరు తాలూకాలలో చేపల పాండ్‌లు లేని గ్రామం లేదన్నా అతిశయోక్తికాదు. వ్యవసాయంతో విసిగిపోయిన రైతాంగానికి చేపల పెంపకం వరప్రసాదంగా కన్పిస్తున్నది.

చేపల పెంపకంవల్ల ఏరైతుకూ లక్షలలో లాభాలురావు; కాని గౌరవప్రదంగా మధ్యతరగతి జీవనంగడిపే అవకాశం లభిస్తున్నది రైతు ఈ మార్గంలో నూతనంగా బ్రతికేఅవకాశం ఎందుకివ్వాలను కున్నదేమో - కరెంటు బిల్లులద్వారా దెబ్బ కొట్టడానికి ప్రయత్నిస్తున్నది.ప్రభుత్వం. ఒక ఎకరా చేపల పాండ్‌పై రైతుకు మహాపస్తే 7,8 వేల రూపాయల ఆదాయం లభిస్తుంది ఆదే ఎకరానికి కరెంటుబిల్లులు పరిశ్రమలతో సమానంగా కడితే, ఐదారు వేలు అదనంగా ఖర్చవుతుందట అంటే ఏడాదంతా కష్టపడి, రైతులు తమ ఆదాయాన్ని కరెంటుబిల్లుల రూపేణా ప్రభుత్వానికి అప్పగించవలసి వస్తుందన్నమాట. ఇంతకంటే అన్యాయం, దోపిడి వేరొకటి వుండదు.

# సింహపురి సమస్యలు

31 తేది సమావేశంలో పాల్గొన్న రైతులందరూ ఈ అంశంపై తమ ఆగ్రహాన్ని వ్యక్తంచేశారు ఈ సమావేశాన్ని సంఘం అధ్యక్షుడు శ్రీ సన్నపరెడ్డి సురేష్ రెడ్డి అధ్యక్షించారు. కార్యదర్శి శ్రీ ఆర్. వి. ప్రసాద్‌చౌదరి, ఉపాధ్యక్షుడు శ్రీ కె. జానకిరామరెడ్డి తదితరులు మాట్లాడారు. కరెంట్ బిల్లుల సమస్యపై ప్రభుత్వంతో పోరాడాలని సమావేశం తీర్మానించింది.

## సంస్కృత పాఠశాల వీడ్కోలుసభ

నెల్లూరు, వేదసంస్కృత పాఠశాల టీచర్లుగా రిటైరైన శ్రీ చక్కరాల శ్రీనివాసులు, శ్రీ సుసర్ల సూర్యనారాయణలను స్కూలు సిబ్బంది ఘనంగాసత్కరించింది.

సభను హెడ్మాష్టర్ శ్రీ కె. వి. రమణయ్య అధ్యక్షించారు. శ్రీ చక్రరాం శ్రీనివాసులు మంచి పండితుడు, జ్యోతిష్యశాస్త్రంలో నిష్ణాతుడు అని ప్రశంసించారాయన. రాష్ట్రపతి అవార్డు గ్రహీత శ్రీ బి. విశ్వనాథంకూడా మాట్లాడారు.

## లెక్చరర్ల ధర్నా

కాలేజీలలో పనిచేసే జూనియర్ లెక్చరర్లకు యు జి సి వేతనాలు వర్తింపజేయాలని కోరుతూ ప్రభుత్వ జూనియర్ లెక్చరర్ల సంఘం ఆధ్వర్యంలో 5 తేది కలెక్టరేట్ ఎదుట ధర్నా చేశారు వందమందికి పైగా పాల్గొన్న ఈ ధర్నాకు సంఘం కార్యదర్శి శ్రీ జి. శ్రీనివాసరావు నాయకత్వం వహించారు; సభను శ్రీ ఎల్ కళ్లయప్ప అధ్యక్షించారు.

## డి పి ఆర్ ఒ ల విందులు

నెల్లూరు కొత్త డి పి ఆర్ ఒ గా నియమితులైన శ్రీ ఎం. రామమూర్తి 5 తేది ఉదయం తన ఆఫీసులోనే పాత్రికేయులకు చిన్నవిందుచేశారు; బదిలీపై వెళ్ళిపోతున్న పాత డి పి ఆర్ ఒ శ్రీ వై. వి. రత్నం 6 తేది ఉదయం హోటల్‌లో బ్రేక్‌ఫాస్ట్ ఇచ్చారు.

## దర్గామిట్ట స్కూలుకు అయ్యవారి విరాళం

దర్గామిట్టలోని జి.వ్రి వ. హైస్కూలుకు, అదేపాఠశాలం తెలుగు టీచరు శ్రీ హరినారాయణరెడ్డి, ఆయన సతీమణి శ్రీమతి జానకమ్మ ఒక గోడ గడియారం బహూకరించారు. పైగా, ఇదివరకు స్కూలుకు మంచి నీటి సౌకర్యంకూడా కల్పించారట. ఈ దంపతులకు కృతజ్ఞతలు చెప్తున్నారు.-శ్రీ వాస్తు రామచంద్రరావు.

-కొనసాగింపు 9వ పేజీలో



# సణుగుడు

## ● మైపాడు విద్యార్థుల చావులో ఎవరి బాధ్యతా లేదా ?

మైపాడు తీరంలో నలుగురు విద్యార్థులు దుర్మరణంపాలై రెండు వారాలు గడిచిపోయాయి. కడుపుశోకంతో తల్లిదండ్రులే ఆ నాలుగు కుటుంబాలవారు తప్ప, అందరూ ఆ విషాద సంఘటనను మర్చిపోయారు. హత్యలు, ప్రమాదాలు, చావులు, విమానాలు కాలిపోవడాలు, రైళ్లుకూలిపోవడాలు. బస్సులు బోల్తాకొట్టడాలు, నక్సలైట్లు బాంబులు పెట్టి మనుష్యులను పేల్చివేయడాలు, లిక్కరు సేవించడాలు అత్యంత మామూలు విషయాలుగా పరిగణింపబడుతున్న ఈ రోజులలో నలుగురు విద్యార్థుల చావును ఎంత కాలం గుర్తు పెట్టుకొంటారు? ఎవరుగుర్తుపెట్టుకొంటారు?

పౌర జీవితంలో యాంత్రికత పెరిగిపోయింది; స్పందనన్నదే లోపిస్తున్నది. ఎంత పెద్ద చావు వార్తయినా కానీ, దినపత్రిక తెరిచిలో చదువుతూ సిప్పే; తరువాత పత్రిక ప్రక్కన పడేసినట్లే, వార్తనూ బుర్రనుంచి తీసిపారేస్తున్నారు. ప్రమాదాలు, చావులేకాదు; వి. పి. సింగ్ విదేశీఖాతాలు, రాజీవ్‌గాంధీ బోఫోర్స్, ఎన్ టి ఆర్ విశ్వామిత్ర వంటి సంఘటనలపై కూడా పత్రికలలో ఆసక్తి తప్ప, ప్రజలలో చర్చలేదు. పత్రికలో తిన్నారని వ్రాస్తే ఉదయం టౌను కాఫీలు నములుతున్నారు; రాత్రి టీవీలో తినలేదనిచెప్తే నిజమే అయ్యుంటుంది పాపం అంటున్నారు. ఇలా రాజకీయంగాని, మరొకటి, మరొకటి గాని స్వంత బుర్ర పెట్టి ఆలోచించే ఆసక్తి, ఓపిక, తీరిక జనంలో నశించిపోతున్నాయి.

ఇదివరకు ట్రంకురోడ్డులో సాయంత్రం నిలబడితే మనిషిపాటిటి మురుగు కాల్వంముంది, ఇందిరాగాంధీ విదేశీ విధానం వరకు అనర్గళంగా చర్చలు విన్పడుతుండేవి,

—కొనసాగింపు 9 వ పేజీలో

# నెల్లూరు లుబ్బూళ్లు
## విలేఖకుడు

### రామనారాయణ రెడ్డి

రోడ్డు భవనాల మంత్రి శ్రీ ఆనం రామ నారాయణరెడ్డి 11 తేది నెల్లూరు వస్తారట; కార్యక్రమ వివరాలు అధికారికంగా అంది లేదు

### జనార్ధనరెడ్డి

మాజీ పిసిసి అధ్యక్షుడు శ్రీ ఎన్. జనార్ధనరెడ్డి 8 తేది నెల్లూరు వచ్చారు. 7 తేది వరకు ఇక్కడే వుంటారు. పెళ్ళిళ్ళు, ప్రెస్ కాన్ఫరెన్స్‌లే కార్యక్రమాలు.

### కోటి సంతకాలలో తగ్గిన నెల్లూరువాటా

ముఖ్యమంత్రి ఎన్. టి. రామారావు ప్రభుత్వాన్ని తొలగించివేయాలనికోరుతూ పిసిసి అధ్యక్షుడు డాక్టర్ ఎం. చెన్నారెడ్డి తల పెట్టిన కోటిసంతకాల ఉద్యమంలో నెల్లూరు డి. సి. సి. రెండున్నర లక్షం సంతకాలు మాత్రమే సేకరించినట్లుంది. పి సి సి. డి సి సి కి ఇచ్చిన కోటా నాలుగు లక్షలట, ఈ ఉద్యమంపట్ల శ్రీ ఎన్. జనార్ధనరెడ్డి వర్గం నిరాసక్తత ప్రదర్శించడమే ఈ కొర తకు కారణమనుకుంటాము. పాపం సుబ్బారెడ్డిగారు ఒక్కరే ఎన్నికాగితాలమీద సంత కాలు పెట్టించగలరు చెప్పండి!

### పిపి నియామకం

ఎట్టకేలకు, చిట్టచివరకు నెల్లూరు జిల్లా కోర్టు పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గా మాజీ పిపి శ్రీ కె. వి. రమణయ్యను నియమించారు. తెలుగుదేశం పార్టీలోని రెండు వర్గాలూ ప్రతిష్టాసమస్యగా తీసుకుని అదు వెంబడీలు పోరాడిన నియామకం ఇది. చివరకు మంత్రి శ్రీ ఆనం రామనారాయణ రెడ్డిగారే సఫలుకాలేకపోయినట్లున్నారు.

అదనపల్ జిల్లా జడ్జి కోర్టుకుకూడా మాజీ ఎపిపి శ్రీ బలరామయ్యగారినే నియమించారు. సబ్ కోర్టుకు తెలుగు దేశం న్యాయకమిటీ సభ్యుడు శ్రీ సైదాను నియమించారు. ఈనియామకంలో మాత్రం రామనారాయణరెడ్డిమాటచెల్లుబాటైనట్లుంది.

### వెంకటగిరి జాతర

వెంకటగిరి పోలేరమ్మ జాతర 18 నుండి 28 తేది వరకు జరుగుతుంది.

సరామామూలుగా జాతరలో జంతు బలులు చేయరాదని రెవెన్యూ అధికారులు విశేష ప్రకటన చేశారు.

### అమెరికాకు వెళ్తున్న నెల్లూరు విద్యార్థి

స్వర్గీయ కె వి ఆర్ మనుమడు, మాజీ మునిసిపల్ కౌన్సిలర్ శ్రీ గూడూరు భాస్కరరామిరెడ్డి కుమారుడు గూడూరు మహేష్‌రెడ్డి ఉన్నత విద్యాభ్యాసం కోసం 11 తేది అమెరికా వెళ్తున్నారు. మహేష్ ఎం టెక్ పట్టభద్రుడు; అమెరికాలో ఎం బి ఎ చదువుతాడట.

ఆ విద్యార్థికి మా శుభాకాంక్షలు

### కాళిదాసు జయంతి

సాహిత్య సదస్సు ఆధ్వర్యంలో 5 తేది సాయంత్రం స్వర్గీయ గుర్రం వెంకట సుబ్రహ్మణ్యం స్మృత్యంకంగా కాళిదాసు జయంతి సభ జరిగింది. డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారు అధ్యక్షించారు. ఉపాధ్యాయ దినోత్సవం, డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్ జన్మదినం, గుర్రం సుబ్రహ్మణ్యంగారి జయంతి ఒకేరోజు కలిసి రావడం సంతోషదాయకమన్నారాయన అన్నమయ్య, త్యాగయ్య, క్షేత్రయ్య వంటి మహనీయుల సంగీతం గురించికాక, సాహిత్యంపైన విస్తృత పరిశోధనలు జర పాలని ఆయన కోరారు.

టిటిడి విద్వాంసుడు శ్రీ ముదివర్తి కొండమాచార్యులు, గుర్రం సుబ్రహ్మణ్యం గారి కాళిదాసరుతుసంహార కావ్యానువాదాన్నిగూర్చి ఉపన్యసించి, సన్మానం స్వీకరించారు. అనువాదంలో ఒక్క వ్యర్థపదం కన్పించదని ప్రశంసించారు శ్రీ కొండమాచార్యులు. శ్రీ యద్ది పల్లి గోవిందుశెట్టిగారు ఆయనకు ప్రత్యేకంగా ఒక శాలువాకప్పి గౌరవించారు. ఈ సభలోనే శ్రీ పిడపాటి విశ్వేశ్వరశాస్త్రి గారినీ సత్కరించారు. గుర్రం వెంకట సుబ్రహ్మణ్యంగారి కుమార్తె ప్రార్థనాగీత మాలపించారు; ఆయన కుమారుడు శ్రీ విద్యాపతి స్వాగతంచెప్పారు. శ్రీ గోసుకొండ వెంకటసుబ్బయ్య వందన సమర్పణ చేశారు.





నీలగిరి సంఘంలో మండలాధ్యక్షుడు రమణయ్య దురాక్రమించిన స్థలం, కొత్తగా నిర్మించిన ప్రహరీగోడ

# పదిలక్షలు చేసే స్థలం దురాక్రమించినమార్క్సిస్టునాయకుడు!

నెల్లూరు, మూలాపేటలోని మునిసిపల్ వాటర్‌ట్యాంకు ప్రక్కగా వుండిన 200 అంకణాల ప్రభుత్వ స్థలాన్ని మార్క్సిస్టు పార్టీ నాయకుడు, నెల్లూరు రూరల్ మండలాధ్యక్షుడు శ్రీ టి. రమణయ్య దౌర్జన్యంగా ఆక్రమించేశాడట. దర్గామిట్టవంటి విస్తరణ ప్రాంతాలలో కంటికి నదురుగా కన్పించిన స్థలాలలో గుడిశెలు వేయించడం, ఉబలంం ప్రదర్శించి వాటిని అమ్ముకోవడం; అది ప్రైవేటుస్థలమైతే అసలు యజమాని నుంచి అందినంత గుంజుకుని అవే గుడిసెలను మరొక నిర్భాగ్యుడి స్థలానికి తరలించడం సి పి ఎం, అగడదపా తెలుగుదేశం బిజెపి నాయకులకుకూడా అలవాటే! అయితే ఇటువంటి అక్రమణల వ్యాపారమంతా దర్గామిట్టకే పరిమితమై వుండేది. రమణయ్యగారు దాన్ని టౌనుమధ్యకు దిగుమతి చేసినట్లున్నారు.

నీలగిరిసంఘంతో పబ్లిక్‌హెల్త్ కార్యాలయం అనుకొనివున్న స్థలమిది. పిడబ్ల్యుడి శాఖ అనుమతితో చాలాసంవత్సరాల నుంచి పబ్లిక్‌హెల్త్ వారు తమ పైపులు, ఇతర సామగ్రి ఇక్కడ పెట్టుకుని వుండేవారట. వారం రోజుల క్రితం రమణయ్యగారు హఠాత్తుగా ఇక్కడికి వచ్చి ఆ పైపులు, గీపులు అక్కడినుంచి తొలగించి, ప్రహరీ గోడకట్టడం మొదలుపెట్టాడట. ఇదితెలిసి, పి డబ్ల్యు డి వర్క్ ఇన్స్‌పెక్టర్ ఒకడు అభ్యంతరపెట్టబోతే అతన్ని కొట్టబోయారట. తర్వాత పి డబ్ల్యు డి అధికారులు రంగంలోకి దిగారు. ఈ స్థలానికి సమీపం లోనే తన కార్యపేరుతో నడిచే ప్రైవేట్ స్కూలుకు ప్లే గ్రౌండ్ కోసం దీనిని కలెక్టర్‌గారు తమకు కేటాయించినట్లు చెప్పారట. వ్రాతపూర్వకమైన ఉత్తర్వు చూపమని అడిగితే మాత్రం, మౌనం వహించారట. వెంటనే పి డబ్ల్యు డి అధికారులు పోలీసు కేసు పెట్టారు. పోలీసులక్కడికి

-తరువాయి 8 వ పేజీలో

### వినాయకచవితి పూజలు వైభవంగా జరిగాయి

ఈసారి వినాయకచవితి ఉత్సవాలు నెల్లూరులో బ్రహ్మాండంగా జరిగాయి. ప్రతి వీధి మొగుదాలలో ఒక విగ్రహం ప్రతిష్ఠించారు. టౌను మొత్తంమీద కనీసం వంద విగ్రహాలుంటాయని అంచనా. ఇందులో 8 అడుగులనుంచి 80 అడుగులవరకు రకరకాలున్నాయి. ట్రంకురోడ్డు, నెల్లూరు ఫార్మసీ దగ్గర బిజెపి వారు ప్రత్యేకంగా తయారుచేసిన శివపార్వతుల విగ్రహం పెట్టారు; మునిసిపల్ చేర్మన్ శ్రీ టి. రమేష్‌రెడ్డి పీఠతో కలిసివచ్చున్నారు. శ్రీ ఆనం వివేకానందరెడ్డి హైదరాబాదు నుంచి ప్రత్యేకంగా ఇంపోర్టు చేయించిన వినాయకుణ్ని కాపువీధిలో నెలకొల్పారు

ప్రతి విగ్రహం దగ్గర ఉట్టి మహోత్సవం, పాటకచేరీలు, విద్యుద్దీప అలంకరణలు, డ్యాన్సులు, హరికథలు... వగైరా వగైరాలతో 8 రోజులపాటు టౌను దద్దరిల్లిపోయింది. 8 వ రోజు నిమజ్జనోత్సవం వైభవం చెప్పనలవికాదు. ట్రాక్టర్లను పూల

-తరువాయి 8వ పేజీలో

# బాలకృష్ణకోసం సబ్సిడీ పెంపు- కృష్ణ అడిగితే నిరాకరింపు!

వాడుకలైన హైదరాబాద్‌లో జరిగే షూటింగ్‌లలోనే పాల్గొంటానని బాలకృష్ణ ప్రకటించిన పక్షం రోజులకే రాష్ట్రంలో నిర్మించే చిత్రాలన్నిటికీ మూడులక్షల రూపాయల సబ్సిడీని ఇవ్వడానికి వీలుగా నిబంధనలను సవరించినట్లు ఆంధ్రప్రదేశ్ చలనచిత్ర పరిశ్రమాభివృద్ధి సంస్థ అధ్యక్షుడు డి. వి. ఎస్. రాజు తెలిపారు. ఈ ఏడాది ఏప్రెల్ 1 నుంచి అమలులోకి వస్తున్న ఈ కొత్త పథకం ప్రకారం ఇంత వరకు పది చిత్రాల దరఖాస్తులు అందాయట. అయితే, కృష్ణ నటించే "రిక్షావాలా" చిత్రం ప్రారంభించిన నెలా పదిహేను రోజులకు దరఖాస్తు చేశారనే కారణంగా తిరస్కరించబడిందట!

అసలు రాష్ట్ర ప్రభుత్వ వైఖరి 'ఇది' అని ఎవరికీ నిర్దిష్టంగా తెలియడంలేదు. మాట కొక పాలసీ, మాటిమాటికీ సబ్సిడీ విధానంలో మార్పు, ఇట్లా రాష్ట్ర ప్రభుత్వ వైఖరి పదేపదే మారుతూండే నిర్మాతలు ఒక నిశ్చితమైన అవగాహనకు ఎట్లా రాగలరు? హైదరాబాద్‌లో ప్రయివేట్ భవనాలలో షూటింగ్ జరపాలంటే రోజుకు పదివేలదాకా అడుగుతున్నారు! కథాపరంగా కొంత రాష్ట్రేతర ప్రాంతాలలో తీయవలసివుండే, సబ్సిడీలో కొంత మినహాయింపు జరుగుతుంది. హాస్యాస్పదమైన కారణాలతో ఇట్లా నిర్మాతలను ఇబ్బంది పెట్టడం చాలాకాలంగా జరుగుతోంది. అందుకే ప్రభుత్వం ప్రకటించే రాయితీలవల్ల లాభోకూడా పొందుతున్న ప్రస్తుతంగా వాటి అమలువల్ల తీవ్రమైన అసంతృప్తిని వ్యక్తంచేస్తున్నారు ఎందరో నిర్మాతలు.

ఆయినా, సంవత్సరానికొక కొత్త విధానాన్ని రూపొందించి, ముఖ్య పత్రికల నిండా ఫుల్ పేజీ ప్రకటనలను ప్రభుత్వం గుప్పిస్తూపోవడానికి అర్థాలు ఏవరకున్నాయి?

## మద్రాసు సినిమా వార్తలు

### వాణిశ్రీకి కన్నాంబ అవార్డు

గతంలో జమున, షావుకారు జానకి, జయసుధ, శారద అందుకున్న కన్నాంబ స్మారక అవార్డును ఈమారు వాణిశ్రీకి ప్రదానం చేస్తున్నట్లు హైదరాబాద్ నవ భారత్ ఆర్ట్ థియేటర్స్‌వారు తెలిపారు. నటనలో కన్నాంబను గుర్తుకుతెచ్చే నటీమణులకు ఏటాయిచ్చే ఈ అవార్డు వాణిశ్రీ కొంతకాలం తెరమరుగవకుండా వుంటే, ఎన్నడో లభించివుండేది.

### పి. చంద్రశేఖరరెడ్డి డైరెక్షన్‌లో "ముట్టడి"

కృష్ణ హీరోగా పి. చంద్రశేఖరరెడ్డి దర్శకత్వంలో బి. పాపిరాజు సమర్పించే జపరత్నా మూవీ క్రియేషన్స్ "ముట్టడి" చిత్రం ఫామిలీ సెంటిమెంట్‌తో క్రైమ్ ఎలిమెంట్ కలిపిన కథ. అక్టోబర్‌లో షూటింగ్ ప్రారంభమవుతుంది. కథ రస వత్తరంగావుంటేనే కృష్ణ ఈమధ్య చిత్రాలు ఒప్పుకుంటున్నారు. అందుచేత "ముట్టడి" రక్తికట్టేకథ అయివుండాలి. గతంలో కృష్ణ, పి. చంద్రశేఖరరెడ్డి కాంబినేషన్‌లో వచ్చిన కొన్ని చిత్రాలు శతదినోత్సవాలు చేసుకున్నాయి.

### అన్నపూర్ణా స్టూడియోస్ చిత్రానికి కోదండరామిరెడ్డి

సెప్టెంబర్ 20న అక్కినేని నాగేశ్వర రావు జన్మదినాన అన్నపూర్ణా స్టూడియోస్ ఒక కొత్తచిత్రాన్ని ప్రారంభిస్తోంది. ఇందులో నాగార్జున, గౌతమి ప్రధాన పాత్రధారులు. దర్శకత్వం: ఎ. కోదండ రామిరెడ్డి సమర్పణ: శ్రీమతి అక్కినేని అన్నపూర్ణ.

### హైకోర్టుతీర్పు ధరోపాతో శ్రీనాథుడి చిత్రం?

ముఖ్యమంత్రి ఎన్. టి. రామారావు "బ్రహ్మర్షి విశ్వామిత్ర" చిత్రంలో నటించడాన్ని సవాల్‌చేస్తూ దాఖలైన రిట్ ఆఫ్ కోవారంటొ, రిట్ ఆఫ్ మాండమస్ పిటిషన్లను హైకోర్టు ఫుల్‌బెంచి కొట్టి వేసిందన్నవార్త తెలియగానే చిత్రనిర్మాతల్లోని తెలుగుదేశం వర్గాల్లో హర్షాతిరేకం

—కొరవ 9వ పేజీలో

# సినిమా కార్మికులసమ్మెతో ఒకవిధంగా పరిశ్రమకు మేలే జరుగుతున్నది!

మద్రాసులో చలనచిత్ర నిర్మాతల మండలికీ వివిధసంఘాలకు మధ్య సాగు తున్న సమ్మె సెప్టెంబరు 1 తర్వాతకూడా ఇంకా కుదరలేదు. వివిధమైన అంగీకారంకుదరక పోవడంతో రికార్డింగ్‌లనుంచి షూటింగ్‌ల వరకు అంతా బంద్. కొన్నికోట్ల రూపాయల ధనం పెట్టుబడులకు దారితీసిందికూడా. చలనచిత్ర పరిశ్రమలో ఇంతటి స్తబ్దత ఎప్పుడూలేదు. గతంలో నిర్మాతలే తమ చిత్రాలు పూర్తిచేసుకునే హడావుడిలో రాత్రి పగలుగా పనిచేసేవారు. ఈ మారు మాత్రం అందరూ ఐక్యంగా వుండిపోవడంతో ఇరు వైపులా పట్టుదల మరింత పెరిగింది. కొంతకాలంవరకు ఏ హైదరాబాదుకో, బెంగుళూరుకో వెళ్ళి షూటింగులు జరుపు కోవడమే మేలనే అభిప్రాయానికివచ్చారు కొందరు తెలుగుచిత్ర నిర్మాతలు. ఈ స్తబ్దతమూలంగా చిత్రనిర్మాణాలసంఖ్య తగ్గవచ్చు. ఖాళీగావున్నందున కొందరు నిర్మాతలు కథాచర్చలపట్ల దృష్టికేంద్రీకరించడానికివీలయింది. ఇందువల్ల చక్కని కథాచిత్రాలు వెలువడడానికి ఆస్కార ముంది. ఇటువంటి పెద్ద ఉద్రిక్తమైన పరిస్థితివస్తేగాని చిత్రాల నాణ్యత మెరుగు పడదేమో!

### "స్వాతిచినుకులు" లో క్రొత్త పాట

"స్వాతిచినుకులు" చిత్రం విడుదలైన రెండవవారానికి హైదరాబాద్‌లో సురేష్‌పై ఒకకొత్త బ్రేక్‌డాన్స్ సాంగ్ చిత్రీకరించ బడింది. దీనిని ఆ చిత్రం ప్రదర్శింపబడు తున్న థియేటర్లలో జోడిస్తారట. దీనివల్ల ఆచిత్రాన్ని రెండోసారిచూస్తారని నిర్మాతల ఆశ. కేవలం బ్రేక్‌డాన్స్‌వల్లే చిత్రానికి ఆదరణ పెరుగుతుందా?

### ఉషాకిరణ్ మూవీస్ "జడ్జిమెంట్"

వాస్తవగాథ ఆధారంగా చిత్రాలు రూపొందించడం చెరుకూరి రామోజీరావు

## ఖాళీ సమయాన్ని కథా చర్చలతో గడుపుతున్నారు!

సంస్థ ఉషాకిరణ్ మూవీస్ ప్రత్యేకత. వీరి 24వ చిత్రం "పైలాపచ్చీసు" విడుదలకు సిద్ధమవుతోంది. 26వ చిత్రం 'జడ్జిమెంట్' సెప్టెంబర్, అక్టోబర్ నెలల్లో వైజాగ్‌లో రెండు షెడ్యూల్స్‌తో పూర్తవుతుంది. మూడు జంటలకు సంబంధించిన కథ ఇది. జంటలుగా శివకృష్ణ, సుధాకర్, వినోద్ కుమార్, కల్పన, యమున, రాజ్యలక్ష్మి నటిస్తున్నారు. ఇంకా బాలయ్య, రాళ్ళపల్లి, అన్నపూర్ణకూడా నటిస్తున్నారు. రచన:పరుచూరి బ్రదర్స్. పాటలు:వేటూరి సంగీతం:రాజ్-కోటి. కెమెరా:డి. ప్రసాద్ బాబు కళ:భాస్కరరాజు.ఎడిటింగ్:గౌతంరాజు ఎగ్జిక్యూటివ్‌నిర్మాత:అట్లూరి రామారావు. దర్శకత్వం: ఎ. మోహనగాంధి.

